

# రామశతకము




జోహరాపురము - పిల్లారెడ్డిగారి కుమార్తెయు,
మొలగవల్లి - గోవింద రెడ్డిగారి యిల్లాలు నగు

కమలమ్మ చేసినది.





శ్రీ మాణిక్య ప్రభు ముద్రణాలయము,
శంకరగిరి, అశ్వపురి (ఆస్పరి) అంచె, బళారిమండలము.

శా॥ శ. ౧౮౪౬ రక్తాక్షి సంవత్సర మాఘము.

1924

శ్రీ

# రామశతకము



శ్రీ మాంగాపురము - పిల్లిగడ్డిగారి కూఁతురును,

మొలగవల్లి - గోవిందరెడ్డిగారి యిల్లాలు నగు

కమలమ్మ చేసినది.



శ్రీ మాణిక్య ప్రభు ముద్రాలయము,

శంకరగిరి, అశ్వాపురి (ఆస్పరి) అంచె, బళ్ళారి మండలము.

శాలి. శ. ౧౮౪౬ రక్తాక్షి సంవత్సరాషాఢము.

1924

ఒరు అమ్ము వేసికోఁ గూడదు] [వెల 4 అణాలు

FIRST EDITION 100 COPIES.

శ్రీ గురు ప్రసన్న

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః!

శ్రీ

# రామశతకము

క. శ్రీరఘుకులాబ్ధిసోమా!
శ్రీ రాజితసుగుణసీమ! సీతాకామా!
కారుణ్యామృతధామా!
ధీరాత్మారామ! నీవె - దిక్కుర రామా! ౧

క. 'స్వామీ! రామా!' యని ని
న్నేమానవుఁ డైనఁ దలఁప - నీ మది భక్తిన్,
ప్రేమను గాతువు; బ్రోతువు;
నామొఱ విని కావ రావె? నరసఖ! రామా! ౨

క. దీనపరాధీనా! సు
జ్ఞాననిధానా! శ్రితజన-సంతానా! సం
తానాపేక్షాసక్తను
నే నబలను నిన్నుఁ గొలువ - నెంచితి రామా! ౩

క. కష్టసుఖంబుల నొక్కటే
దృష్టిని జూచుచును దుష్ట-బృందముఁ దునుమన్,
శిష్టజనముఁ గాపాడ, న
రిష్టముఁ దొలఁగింప, నవత-రించితి రామా! ౪

క. వేదంబు లపహరించిన
యాదైత్యుఁడు సోమకాఖ్యుఁ - డబ్ధిని దాఁగన్
ఆదిని మత్స్యము వై వెస
ఛేదించితి వాని నీవు - శ్రీహరి! రామా! ౫

క. సుర లమృతలబ్ధి కై మం
థరగిరిచేఁ బాలకడలి - ద్రచ్చ నెంచన్ ద
ద్గిరి మునుఁగఁ గూర్మ మై యు
ద్ధరించితివి నీవు మునుఁగు-దానిన్ రామా! ౬

క. అరుదుగ నజునరబలమున
హిరణ్యనేత్రుండు పూని - యిలఁ జాఁపవలెన్
బొరిఁ జుట్టచుట్టఁ బోవఁగ
వరాహ మై చంపినావు - వానిన్ రామా! ౭

క. వరభక్తునిఁ బ్రహ్లాదుని
గరుణన్ గావంగఁ బుట్టి - కంబమున, మహా
సురుని హిరణ్యకశిపుఁ ద్వర
నరహరి వై నీవు చంపి - నావుర రామా! ౮

క. చాలన్ మూఁడడుగుల దా
నేలన్ దానంబు వేఁడి - నిర్దయుఁ డై పా
తాళమునకుఁ ద్రొక్కితి వవ
లీలన్ వామనుఁడ వై బ-లిన్ దొలి రామా! ౯

క. కరుణామూరు లయినభూ
వరులన్ ముయ్యేడుమార్లు - పగ దీఱంగా
నఱికితివి వెదకి యంతట
ధరను బరశురాముఁడ వయి - తారక! రామా! ౧౦

క. దశరథునకుఁ గౌసల్యా
శశిముఖి గర్భమునఁ బుట్టి - జానకిఁ బెండ్లా
డి శరణ్యులఁ గాఁచి ఖలుని
దశకంఠునిఁ జంపినావు - ధార్మిక! రామా! ౧౧

క. తలిదండ్రుల చెఱఁ బాపఁగ,
ఖలు లగుకంసాదుల నొగి - ఖండింపంగా,
ఇలఁ బాండవులను గావఁగ,
నిలలోఁ గృష్ణావతార - మెత్తితి రామా! ౧౨

క. అలబౌద్ధుఁడ వై తులువల
చెలువల వలపించి నోము - చెఱచి పురంద్రన్
బల మెఱి చావఁగఁ జేసితి;
నిలుపవె సజ్జనుల కెపుడు - నీ దయ రామా! ౧౩

క. కలియుగమునఁ గలధర్మము
పొలి బోత్రిగఁ బోయినపుడు - పుట్టుదు వింకన్
గలికావతారుఁ డై యిల
నలుపదములధర్మము మఱి - నడపఁగ రామా! ౧౪

క. పరమాత్ముఁడ వగునీవే
నరలోకమునందుఁ బుట్టి-నది మత్స్యాన్
దరియింపఁ జేయుకొఱకే
మఱి వేఱేపనికిఁ గాదు - మాధవ! రామా! ౧౫

క. పదివేసంబులసామివి
సదయుఁడ వై పుట్టి పెరిఁగి - సంచారముచే
సి దపస్విలఁ గాచినతా
విదియే కద! పుణ్యభూమి - యిలలో రామా! ౧౬

క. పరమతపోధనుల కెప్పుడు
శరణ్యమయి నీపవిత్ర-చరణస్పర్శం
బారసినదండక యనునీ
యరణ్యమునఁ బుట్టి ధన్యు - లైతిమి రామా! ౧౮

క. ఈపుణ్యభూమిలో నీ
ప్రాపు గనినధన్యు లందు-పావనభూమిన్
మాపుట్టుక సఫలం బై
యేపొందఁగఁ జేయవయ్య - యెలమిన్ రామా! ౧౯

క. నిను నమ్మి కొలుచుఘనులకుఁ
గనరాని ద దెందుఁ గలదు? కామితవరదా!
సనకసనందననారద
జనకశుకాదినుతచరిత! శ్యామలరామా!

క. దీనులకుఁ గల్పవృక్షమ ౧౯
వౌనిను, దేవాదిదేవు, నఖిలాండపతిన్
నే నెంతదానఁ బొగడఁగ
మానిజనమనోనివాస! మాధవ! రామా! ౨౦

క. శరణాగతపరిరక్షణ
బిరుదము నీ కొప్పినట్లు - వే రెవ్వరికిన్
బరికింపఁగ నొప్పిన దే?
సరి నీ కెవ్వరు? దయార్ద్ర-సస్థితి రామా! ౨౧

క. నీనామామృతమును దన
మేనంతట నింపఁ గలుగు-మేటి హనుమఁడే
తా నెఱుఁగును దానిచవిన్;
గాని యొరు లెఱుంగ లేరు - గదరా? రామా! ౨౨

క. ధ్రువ ప్రహ్లాదాదుల కీ
భువి నభయం బెట్టు లిచ్చి - ప్రోచితి, వల్లీ
భవదీయభక్తులను బ్రో
వవె? నేఁడును నిశ్చయముగ - భవహర! రామా! ౧౩

క. నీకథ వివరింపఁగ వా
ల్మీకమహాఋషులవంటి- మేటికవీశుల్
వేకోట్లకొలఁదివారికిఁ
గాక మిగులు నన్ను, మిథ్య - గాదుర రామా! ౧౪

క. దశరథరాజకుమారా!
దశముఖసంహార! యువిత-తాపసవారా!
విశదముగ నీచరిత్రము
వశమే? వర్ణింప నాకు - వనితకు రామా! ౧౫

క. నీమాయ నెఱుఁగఁ జాలను;
ప్రేమను దెలియంగ జ్ఞాన-దృష్టి యొసఁగి యో
సామజవరదా! నీవే
నామదిఁ గలచింత దీర్పు - నరహరి! రామా! ౧౬

క. గడి యైనను విడువను ని;
న్నెపు డైనను గదల నీయ; నాత్మను నిత్యం
బుడుగక సేవించెదునను
దడయక కావంగ రావె - దయతో రామా! ౧౭

క. పరివారికిఁ బరిహాసము
ధరలోపల మమ్ముఁ జూడఁ - దారకనామా!
పరిహాసాస్పదకారణ
మరసి తొలంగింపు దాని - నచ్యుత! రామా! ౧౮

క. నీపదములు మది నమ్మితి;
నాపాపము లెంచ కుండ - నన్నెపుడుఁ గృపన్
గాపాడు దీనబంధూ!
నాపాలిటిదైవ మీవె - నరసఖ! రామా! ౨౯

క. నమ్మినవారిని జెఱచుట
యిమ్మహి నీ కిష్ట మౌనె? యినకులతిలకా!
సమ్మతముగ మా కభయం
బిమ్మా కృపతోడ లోక..హితకర! రామా! 30

క. ప్రస్తుతముగఁ దొలుదొల్తటి
పుస్తకముల వ్రాయఁబడె "నపుత్రస్య గతి
ర్నాస్తి", యనువాక్య; మీయది
వాస్తవ మన కుంత రాదు - వనితకు రామా! 3౧

క. తమ్మెటు కని పెంచిరో తను
యమ్మయు, నప్పయును నెమ్మి, నటు పిల్లలఁ దా
మిమ్మహిఁ గని పెంచక పో
దమ్మది యప్ప దగున ప్పటందురు రామా! 3౨

క. "ఆలుమగం డయి యుండుట
యేలా? కని పెంచి యెలమి - నిలు నిలిపి చనం
గా లేనిభాగ్యహీనులు
నేల", నని తలంచి వగతు - నెమ్మది రామా! 33

క. ఏకలిమియు లోకమునన్
లేక సతీపతులు చింత - లేక బ్రతుక నాఁ
గాక; యయినసంతానము
లేక బ్రతుకఁ గాదు వంతి - లేకయె. రామా! 3౪

క. అనఘాత్మా! నే బిడ్డలఁ
గని పెంచినకష్ట మొకటి - గంటిని; నా కీ
తను వుండుదాఁక వారిని
గనుభాగ్యము లేక పోయెఁ - గా! హా! రామా! ౩౫

క. పుట్టించి మాకుఁ బిడ్డల
గిట్టించితి వేల? నీకుఁ - గ్రీడయె? యిదియున్;
రెట్టించినదయఁ బ్రోవవె;
గట్టిగ మది నమ్మినాము - కడఁకన్ రామా! ౩౬

క. వెనుకటిజన్మంబున నేఁ
గనికర మొకయింత లేని-కర్మ మదెంతో
యొనరించి యున్నకతనన్
కని పెంచినపిల్ల లెల్లఁ - గడచిరి రామా! ౩౭

క. పరమదయాకరుఁడవు, శ్రీ
కరుఁడవు, సర్వస్వతంత్ర-ఘనమహిముఁడ, వా
పరమాత్ముండవు వెనుకటి
దురితము తొలఁగించి కావు - దోషిని రామా! ౩౮

క. తల్లికడుపులో బిడ్డని
యొల్లి కలుగుకాఁక సోఁక - కుండఁగ నెటు మే
నల్లునికొడుకును గాచితి
తొల్లి, యటులు కావ రావె - తోడని రామా! ౩౯

క. దంపతు లిద్దఱు భక్తిని
నింపుగఁ బూజించు చుందు - మెప్పుడు నిన్నే;
పెంపుగ మావంశము నను
కంపామతి నుద్ధరింపు - కలిలో రామా! ౪౦

క. కానిది యేదైన, కల్గనది
కానట్లే చేయు నీకుఁ - గా కెవ్వని కేఁ
గాని తనంతటఁ జేయఁగ
నౌ నెట్లు? మహానుభావ! యవ్యయ! రామా! ౪౧

క. క మ్మన్నఁ, గాని దేదీ?
ర మ్మన్నను, రాని దేది? రయమున నీ వై
పో మ్మన్నఁ, బోని దేదీ?
సమ్మతి బ్రహ్మాండమునను - సద్గురు! రామా! ౪౨

క. మి, న్నగ్గి, గాలి, నీ, రీ
మ, 'న్నిట్లే తోఁచు', 'మిట్లె - మండు', 'మిటులె నీ
వెన్నఁడు విసరుము', 'పాఱు మి',
'టన్నిట ని ట్లగు', మటన్న, న ట్లవు రామా! ౪౩

క. 'మెఱవు', మన, మెఱపు మెఱచును;
'ఉఱుము', మనిన, నుఱుము నుఱు మహహో! చిత్రముగా;
'కురియు', మనఁ, గురియు వానలు:
హరి! నీయాజ్ఞయె మహాజ్ఞ - యౌఁ గా? రామా! ౪౪

క. పుట్టు మనిన, బ్రహ్మాండము
పుట్టును నాకసము, నేల, పొద్దు మొదలుగా;
గిట్టు మనినఁ, దక్షణమే
గిట్టును బుట్టినవియన్ని - కేశవ! రామా! ౪౫

క. నీమాటకు బదు లున్నదె?
నీమన సె, ట్లట్లె కాక - నిజముగ వేతే
యే మైన నౌనె? యెందును
నీమహిమకుఁ గొఱఁత గలదె? నిర్గుణ! రామా! ౪౬

క. దేవుండవు నీ వొకఁడవె;
యీవిశ్వంబునకుఁ గర్త - వీ వొక్కఁడవే;
నీవలన నన్ని పుట్టును;
నీవలననె యన్ని గిట్టు - నిజముగ రామా! ౪౭

క. నీ కెఱుక లేక యెక్కడ
నేకార్యము గాదు కాఁ - దెప్పటికిని నే
లోకమునఁ దలఁచి చూడఁ; మ
హాకారణమవు కారణమున - కద్వయ! రామా! ౪౮

క. అమ్మలకడుపులఁ బిల్లలఁ
దొమ్మిదినెల లెట్లు పెంచు-దువొ; పుట్టఁగనే
పిమ్మట నెటు పుట్టింతువొ
అమ్మలచనులందుఁ బాల - నరుదుగ రామా! ౪౯

క. నీ ళ్లెట్లు పోసి పెంతువొ
రాళ్లన్ గలకప్పలను ని-రంతరమును; వే
నోళ్లు గలవాని కైనను
వల్లానే? చెప్ప నీప్ర-భావము రామా! ౫౦

క. ఎనుబదినాలుగులక్షలు
గ నేలఁ నెన్నఁబడు జీవ - కోటమున కెట నీ
కనికర మెటు లౌనో దా
పును, బ్రాపును, గాపు నెల్ల-పుడు శ్రీరామా! ౫౧

క. వేదంబులు, శాస్త్రంబులు,
నాదిపురాణంబులు, నితిహాసంబులు నె
న్నేఁ దెలిసిన, నినుఁ దెలియక
లేదు ఫలం బిహపరముల - లేశము రామా! ౫౨

క. అన్ని యెఱింగినవాఁడవు;
అన్నింటిని జేయఁ జేత - నౌవాఁడవు; నీ
వన్నింటను గలవాఁడవు;
నిన్నుఁ దెలియ నీవె నన్ను - నిర్గుణ! రామా! ౫౩

క. ని న్నొక్కని నెఱిఁగితినా,
యన్ని యెఱిఁగినట్లె; యంత-రాత్ముని, నిత్యున్
ని న్నొక్కనిఁ దనిపితినా,
యన్నిట నందఱను దనిపి-నట్లే రామా! ౫౪

క. కరుణాశరధి వనుచు దా
శరథీ! నిను నమ్మినాను - శంకింపక; న
న్నరమర చేయక వంతల
దరిఁ జేర్పవె చింత దీర్చి - తారక! రామా! ౫౫

క. నీవే తల్లివి, దండ్రివి;
నీవే గురుఁడ వీక; నీవె - స్నేహితుఁడ వెటన్;
నీవే చుట్టము, పక్కము;
నీవే దైవంబు; దాత - నీవే రామా! ౫౬

క. పాలకడలిఁ బవళింతువు;
పాలను ముంచుదువొ, నీళ్ల - వడి ముంచుదువో
యేలా? నా కది; నామదిఁ
జాలఁగ నినుఁ దలఁచు టొకటె - చాలును రామా! ౫౭

క. ఇల్లు నిలువఁ గలవారిని,
దల్లితరమువారిఁ, దండ్రి - తరమునవారిన్
ఎల్లరఁ దరింపఁ జేసెడి
పిల్లలఁ గని పెంచ నీవె - ప్రేమను రామా! ౫౮

క. ఒప్పుఁ గుప్పల, నమ్ముల
యప్పలయప్పలను దీర్చి-నప్పల, నొరు లె
ల్లప్పుడు నెనరునఁ గన్నులఁ
గప్పుకొనఁగ నొప్పువారిఁ - గన నీ రామా! ౧౯

క. తలిదండ్రులమాటలు, పె
ద్దలమాటలు, విద్దె, బుద్ధి - తమకుఁ దెలుపున
య్యలమాటలు జవదాఁటక
సలిపెడికొడుకులను నీవె - సద్గుణ! రామా! ౨౦

క. కన్నతలిదండ్రులకుఁ, దమ
యన్నలకును, దమ్ములకును, నక్కలకును, వెన్
దన్నినచెల్లెండ్రకు నై
యున్నకొమారులను నీవె - యొప్పుగ రామా! ౨౧

క. బలవంతుల, గుణవంతులఁ,
దెలివియుఁ దేటయును గలుగు-దీర్ఘాయుష్మం
తుల, వంశోద్ధారకులను,
బలువుగ పుత్రులను నీవె - పార్థివ! రామా! ౨౨

క. గుణమున, రూపంబునఁ జ
క్కనివారయి కీర్తికాంతఁ గైకొని సద్ధ
ర్మనిరతులై వర్తించెడు
తనయులఁ గనుభాగ్య మీవె - దశరథరామా! ౨౩

క. ధైర్యౌదార్యగుణంబుల,
స్థైర్యంబున, వీర్యమునను, శౌర్యంబున, గాం
భీర్యంబున, సాధతన
చాతుర్యుల నీవంటిసుతులఁ - గన నీ రామా! ౨౪

క. సతతం బతిథుల, కభ్యా
గతులకు భయభక్తిచేతఁ - గావలసిన వి
చ్చి తనువుధనాత్ముల, స
న్మతిమంతుల సుతుల నీవె - నరసఖ! రామా! ౬౫

క. తమప్రాణము తమ కెట్లో
సమస్తజీవులకు నట్లె - జగతిన్ దీ పం
చు మదిఁ దెలిసికొని తమతో
సమముగఁ జూచుకొడుకుల నొ - సంగవె రామా! ౬౬

క. పేదలసాదుల కయ్యెడి
బాదలు దొలఁగించుసత్కృ - పాసింధువులన్,
లే దనక దాన మిచ్చుమ
హాదాతల సుతుల నీవె - యచ్యుత! రామా! ౬౭

క. పరధనము మంటిపెళ్లగఁ,
బరదారలఁ దల్లులుగను - భావించు చెడన్,
బరుల కగుమేలె మేలుగఁ
బరికించెడిసుతుల నీవె - భవహర! రామా! ౬౮

క. అనయం బనదలమొఱ విని
కనికరమునఁ గావఁ బ్రోవఁ - గంకణమును గ
ట్టినపుణ్యాత్ములఁ, బలువురఁ
దనయులు గాఁ బుట్ట నీవె - తారక! రామా! ౬౯

క. ఎన్ని తమ కున్న, సుగుణము
లన్నియు నీ విచ్చిన వని - యాత్మ నెఱిఁగి ని
న్నెన్నఁటికి మఱవకుండెడి
యన్నలఁ గనుభాగ్య మీవె - యవ్యయ! రామా! ౭౦

క. ఆఁకలితో, దప్పికతో
'మా కన్నము, నీ', ళ్లటన్న-మానవుల 'క్రివే
కొనుఁడి', యనుచు నిచ్చెద
యాఁకలితుల సుతుల నీవె - యచ్యుత! రామా! ౨౧

క. "మనతల్లినేల యియ్యది;
మన దియ్యది తల్లిభాస; మనవేస మిదా;
మనమత మిది", యనునభిమా
ననిరతు లగుసుతుల నీవె - నరహరి! రామా! ౨౨

క. "ఒకతల్లిపిల్ల లెట్ల
ట్లొకనేలను బుట్టువార - లొక రొకరికి నా
ద్దికఁ దోడ్పడ వలె", ననుబు
ద్ధి కలకొడుకుల దయ నీవె - దేవా! రామా! ౨౩

క. చదు వెంత చదివినను, భూ
తదయాగుణము, సమత, దానగుణము, నె
మ్మదిలోఁ బశ్చాత్తాపము
వదలనికొడుకులను నీవె - పశుపుర రామా! ౨౪

క. స్వార్థము త్యాగము చేసి ప
రార్థము సాధింపఁగాఁ బ్రయత్నపడుచుఁ ద
త్త్వార్థ మెఱిఁగి నినుఁ జేరుకృ
తార్థు లగుసుతుల నీవె - యవ్యయ! రామా! ౨౫

క. "స్వామి వయిననీకార్యమె
తా మేమేఁ జేసినను గదా!" యని మదిలోఁ
బ్రేమను దలంచి చేసెడి
యామహనీయు లగుసుతుల - నడిగెద రామా! ౨౬

క. తనరూపద్దంబునఁ జూ
చినయట్లే తోఁచఁ జేయు-చిన్నిబిడల, నోఁ
చినముద్దులమూటలఁ, జ
క్కనినడత గలట్టివారిఁ - గన నీ రామా! ౨౭

క. "మనకు వలె నితరజీవుల
కును హాయిగఁ బ్రతికి పోవు-కోరిక గా, కిం
కను నధికారము గల", దని
కనుఁగొనుబిడ్డలను నీవె - కరుణన్ రామా! ౨౮

క. పుట్టినయింటికిని, నడుగు
పెట్టినయింటికిని, పేరు, పెంపు గలుగఁ దా
మెట్టు నడవ వలసినదో,
యట్టు నడచునాఁడుబిడల - నడిగెద రామా! ౨౯

క. మగలిండ్లను మానికముల
పగిది వెలసి వారియిండ్ల-పనిపాటున రే
పగలు మునిఁగి 'యిల్లాం', డ్రనఁ
దగియెడిబిడ్డలను నీవె - దశరథరామా! ౩౦

క. పెనిమిటియే నెచ్చెలిగాఁ,
బెనిమిటియే ప్రాణముగను, బ్రియ దైవముగాఁ,
బెనిమిటియె తోడునీడగఁ,
గనియెడిబిడ్డలను నీవె - కరుణన్ రామా! ౩౧

క. దానము, ధర్మము మొదలౌ
నానాసత్కార్యముల మ-నస్సు మగనితో
నే నిలువక మునుముందుకుఁ
బో నిచ్చెడిబిడల నీవె - భూపతి! రామా! ౩౨

క. ధీరులు, కరుణోదారులు,
వీరులు, శూరు, లవితాత్మ-భీరు, లధికగం
భీరు లగుకుమారులఁ గను
వా రౌతల్లులను గనెడి-వర మీ రామా! ౧౩

క. మగలవలె మంచికొడుకుల,
నోగిఁ దమవలెఁ గనికరంబు, నోర్పు మొదలుగాఁ
దగుగుణములు గలగరితల
నెగడించెడిబిడల నీవె - నిర్మల! రామా! ౧౪

క. తమయత్తయింటివారిని,
దమపుట్టినయింటివారిఁ, దక్కినవారిన్
సమదృష్టిఁ జూచు చుండెడి
కొమార్తెలను బుట్ట నీవె - గుణనిధి! రామా! ౧౫

క. ఇల్లాలికి నింటిపయిన్,
బిల్లలపయి, మగనిపైని - బ్రేమ సహజమై
యెల్లపుడు పెరుఁగు చుండును
గొల్లగః నది యొల్లఁ బ్రకృతి-గుణ మో రామా! ౧౬

క. ప్రేమయె సృష్టికి మూలము;
భూమిన్ ధర్మార్థకామ-మోక్షంబులకున్
బ్రేమయె సాధనము; మహా
స్వామీ! యాప్రేమ ప్రకృతి-జన్యము. రామా! ౧౭

క. భవబంధమునకుఁ గారణ
మవుఁ బ్రేమయె మఱపు చేత; నాప్రేమయె తా
భవబంధమోక్షకారణ
మవు నంటఱు కెఱుక చేత - నచ్యుత! రామా! ౧౮

క. ఇల్లాలికిఁ బెనిమిటియే
యెల్లప్పుడు నేడుగడయు, నెల్లగతియు; శ్రీ
వల్లభ! దయ నా పెనిమిటి
యొల్లనీ, మది, నాత్మఁ గావు - మోరఘురామా! ౮౯

క. హనుమంతుని పై, సుగ్రీ
వుని పైని, విభీషణుపయి, మునివరులపయిన్
మును చూపిన ప్రేమము నా
పెనిమిటిపయిఁ జూప నిన్ను - వేఁడెద రామా! ౯౦

క. శబరిపయి, నహల్యపయిన్,
దబసులయిల్లాండ్ర పైని, ద్రౌపది మొదలౌ
నబలల పైఁ జూపినకృప
యబలను నా పైని జూప - నడిగెద రామా! ౯౧

క. పాపులము, నాపరాధుల,
మేపుణ్యము చేయ నెఱుఁగ - మెప్పుడు; మాకున్
నీపదములె గతి యంటిమి:
కాపాడవె మమ్మిరువురఁ - గరుణన్ రామా! ౯౨

క. ఈసంసారసముద్రము
నీసద్భక్తి యనునోడ - నే దాఁటఁగ నీ
వే సర్వజగద్రక్షక!
నీసాక్షిగ వేఁడు గోర - నిశ్చల! రామా! ౯౩

క. కమలాక్ష! కమలనాభా!
కమలభవాదినుతశీల! కమలానాథా!
కమలధిశయనా! నిత్యము
'కమలమ' యనుభక్తురాలిఁ - గావవె రామా! ౯౪

క. భానుకులజలధిసోమా!
దీనజనపరాయణాతి-దివ్యప్రేమా!
మానివరాత్మారామా!
శ్రీనిర్వాణపదధామ - సీతారామా! ౯౫

క. శరణు పరాత్పర! రామా!
శరణు కృపాసింధు! రామ! శత్రువిరామా!
శరణు భవహరణ! రామా!
శరణు జగద్బంధు! రామ! శ్యామలరామా! ౯౬

క. జయ జయ చిన్మయ! రామా!
జయ జయ పాపహర! రామ! జయ జయరామా!
జయ జయ రక్షక! రామా!
జయ జయ మోక్షకర! రామ! జయ రఘురామా! ౯౭

క. మంగళ మవ్యయ! రామా!
మంగళ మమనస్క! రామ! మాధవ! రామా!
మంగళ మచ్యుత! రామా!
మంగళ మనఘాత్మ! రామ! మధురిపు! రామా! ౯౮

క. భద్రము భయహర! రామా!
భద్రము జగదీశ! రామ! పరతర! రామా!
భద్రము దశరథరామా!
భద్రము పరమూర్త! రామ! పావన! రామా! ౯౯

క. 'పిల్లలు గానవలె మా', కని
యిల్లాండ్రకు నెంతకనుక - నీరిక లేమిన్
గొల్లగఁ గోరిక, లుండెడి
నెల్లరకుఁ గడి నంతకనుక - సీతారామా! ౧౦౦

క. చదువరు లెవ రైనను దా
'మిది తప్పులకుప్ప' యనుచు - నెగతాళియొన
ర్పఁ దలఁచిన, నామదిని నీ
పదభక్తి య దెట్లు కొఱఁత-పడు? శ్రీరామా! ౧౦౧

శ్రీరామార్పణ మస్తు!

